# ప్రాచీన

# భగవద్గీత



బాపట్ల
( గుంటూరు జిల్లా )

భీమునిపట్నము
( విశాఖ జిల్లా )

రు. 0-80

ప్రాచీన

# భగవద్గీత

గోండాల్ రసశాల ఔషధాశ్రమమువారిచే సేకరింపబడిన

భోజపత్ర లిఖితప్రతి - 745 శ్లోకములతో






ప్రకాశకులు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల ( గుంటూరు జిల్లా )

భీమునిపట్టణము ( విశాఖ జిల్లా )



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము : ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాముల వారిచేతను, యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము : సంవత్సరమునకు మొత్తమునకు రెండువందలు పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము: (1) రు. 516/- మించు విరాళ మొసంగువారు మహారాజ పోషకులు. ఒక ముఖ్యగ్రంథమున వీరి ఫొటో ప్రకటింపబడును. వీరి నామములు ప్రతి కుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథమాల ప్రచురణము లన్నియు నుచితముగ వీరి కొసంగబడును.

(2) రు. 100/- మించు విరాళ మొసంగువారు రాజ పోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింప బడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుకూడ నుచితముగ బడయుదురు.

(3) రు 50/- మించు విరాళ మొసంగువారు పోష కులు. వీరి నామములు అన్ని ప్రచురణముల ప్రకటింప బడును. ప్రచురణముల వీరు సగముధరలకు బడయుదురు.

(4) రు. 25/- మించు విరాళ మొసంగువారు మిత్రులు. ప్రచురణముల వీరు $\frac{3}{4}$ ధరలకు బొందుదురు.

---

గ్రంథమాలయొక్క మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి తోడ్పడుదురుగాక

# విరాళ కర్తలు

## మహారాజ పోషకులు

### రు. 516/-

1. శ్రీ బలభద్రుని చెన్నయ్య శెట్టిగారు అండ్ సన్స్.
   కమీషన్‌మర్చంట్స్, ఆయిల్ మిల్స్, భీమునిపట్టణము
2. శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు అండ్ సన్,
   శ్రీ వెంకటేశ్వర ఆయిల్ మిల్స్, భీమునిపట్టణము
3. శ్రీ నందగిరి వేంకట రామదాసు పంతులుగారు
   అండ్ సన్స్, శిర్ల పాలెము. భీమునిపట్టణము
4. శ్రీ పూసపాటి రామచంద్రరాజుగారు, B.E. రిటైర్డ్
   ఎగ్జిక్యూటివ్ ఇంజనీయర్, విశాఖపట్టణము

## రాజపోషకులు

1. శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు.
   కమీషన్ మర్చంట్స్, నెల్లూరు రు. 300
2. పసుమర్తి శేషాచలం శెట్టిగారు,
   క్లాత్ మర్చంట్స్, .. 100
3. నూనె శేషాచలం శెట్టిగారు, రైస్‌మిల్స్
   అండ్ కమీషన్ మర్చంట్స్ .. 116
4. నూనె జగ్గయ్య శెట్టిగారు, రైస్‌మిల్స్
   అండ్ కమీషన్ మర్చంట్స్. .. 100

5. శ్రీ చిత్తూరు మునుస్వామి మొదలియార్‌గారు,
కమీషన్ మర్చంట్స్, నెల్లూరు 116

6. యడ్లపల్లి గోవిందు శెట్టిగారు, ఐరన్ అండ్
ఫర్టిలైజర్స్, ,, ,,

7. గాలి నారాయణరావుగారు, M.A., L.T.,
రిటైర్డు ప్రిన్సిపాల్, కర్నూలు ఉస్మానియా
కాలేజి ,, 100

8. కొత్తూరి రామయ్య అండ్ కర్పూరపు
రామకృష్ణమూర్తి కంపెనీ, టుబాకో
మర్చంట్స్, గుంటూరు ,,

9. పోలిసెట్టి సోమసుందరంగారు, టుబాకో
మర్చంట్స్, ,, ,,

10. కర్పూరపు వెంకట నారాయణగారు,
టుబాకో మర్చంట్స్ ,, ,,

11. వంకాయల కోటేశ్వరుడుగారు, టుబాకో
మర్చంట్స్, ,, ,,

12. కర్పూరపు కనకవల్లి తాయారమ్మగారు, ,, ,,

13. బొలిశెట్టి హనుమంతరావుగారు,
విజయ అండ్ కో., ,, ,,

14. బూదరాజు వెంకట నరసింహారావుగారు,
డాక్టరు స్వర్ణ ,,

15. బొలిసెట్టి సీతారామయ్యగారు, అడ్వొకేట్,
బాపట్ల 232

16. శ్రీ బొడ్డుపల్లి సీతారామస్వామి శాస్త్రిగారు,
కర్లపాలెం 100

17. మంతెన వేంకట రామరాజుగారు, B.A..
బుద్దాం 116

18. పులిపాక సూర్యప్రకాశరావు గారు, కరణం,
అమృతలూరు 100

19. యం.యల్.యస్. నారాయణరావుగారు,
భట్టిప్రోలు ,,

20. జగర్లపూడి వేంకటేశ్వర్లుగారు, విజయవాడ ,,

21. బిట్రెడ్డి తమ్మేశ్వరరావు గారు,
వైర్‌లెస్ ఇన్స్పెక్టరు, ,, ,,

22. బొడ్డపాటి సత్యనారాయణగారు, ,, ,,

23. మల్లాది వెంకట కుటుంబరావుగారు, ,, ,,

24. వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, బందరు 116

25. వల్లూరి వేంకట సూర్యనారాయణగారు,
B.A., B.L., వకీలు ,, 100

26. యద్దనపూడి రామచంద్రరావుగారు, ,, ,,

27. తాడంకి వేం. కృష్ణారావుగారు,
అడ్వొకేట్ ,, ,,

28. మోటమర్రి దయానిధిగారు, ,, ,,

29. తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు,
మెడికల్ షాప్ ,, ,,

30. శ్రీ చిత్రపు అచ్యుతరామయ్యగారు, బందరు 100
31. దీవి సేతు మాధవాచార్యులుగారు, ,, ,,
32. అద్దేపల్లి వేంకట రామయ్యగారు. ,, ,,
33. పిన్నమనేని లింగయ్య చౌదరిగారు. అడ్వొకేట్ ,, 116
34. వి. శ్రీ రంగమూర్తిగారు, C. T. O ,, 100
35. శ్రీమంతు రాజా యార్లగడ్డ విశాలాక్షమ్మగారు, ,, ,,
36. బొమ్మదేవర హేమలతాదేవి బహద్దర్ వారు, B. A, ఏలూరు ,,
37. చావలి సీతారామయ్యగారు, B. E, అగ్రికల్చరల్ ఇంజనీయర్, . ,,
38. బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి ,,
39. బండి రామారావుగారు, ,, ,,
40. మంచిరాజు చిన వేంకట రత్నంగారు, భీమడోలు ,,
41. మావులేటి సోమరాజుగారు, గుండుగొలను ,
42. దుర్గంపూడి ధర్మరాజుగారు. ,, ,,
43. భీమవరం వర్తకసంఘ భవన గ్రంథాలయము, భీమవరము ,,
44. ఇమ్మిడి సత్యనారాయణగారు, కమీషన్ మర్చంట్, పాలకొల్లు ,,
45. బొండాడ వేంకటరాజు గుప్తగారు, క్లాత్ మర్చంట్, ,, ,,

46. శ్రీ రాజులపాటి వేంకటేశ్వర్లుగారు, పాలకొల్లు 100
47. అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు
M. L. A, ,, ,,
48. కలగ వేం. సూర్య సత్య శంభు
ప్రసాద్‌గారు, ,, ,,
49. దశిక రామారావుగారు, B. D, ఎక్స్‌టెన్‌షన్
సూపర్‌వైజరు, కొవ్వూరు ,,
50. చిన్ని తరుణయ్యగారు, B. E.,
A. M. T. E, అసిస్టెంట్ ప్రొఫెసర్
ఇంజనీరింగ్ కాలేజి, కాకినాడ ,,
51. కాళ్ళకూరి సూర్యనారాయణగారు,
విశాఖపట్టణము ,,
52. కులుకూరి సన్యాసి శెట్టిగారు,
జనరల్ మర్చంట్స్, ,, ,,
53. బెండపూడి పేరరాజుగారు,
M. B. B. S, ,, ,,
54. పలుకూరి జగన్నాధరావుగారు, ,, ,,
55. దేవులపల్లి కృష్ణమూర్తిగారు, B, E,
లెక్చరర్, యూనివర్సిటీ ఇంజనీరింగు
కాలేజ్ ,, ,,
56. ద్విభాష్యం అన్నపూర్ణయ్యగారు,
సూపరింటెండెంట్, రీజినల్ ట్రాన్స్‌పోర్టు ,, ,,
57. ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, కమీషన్
మర్చంట్, అనకాపల్లి ,,

58. శ్రీ కలిగొట్ల సూర్యనారాయణగారు,
ము. ఛైర్మన్, భీమునిపట్టణము 100

59. దుర్గాదానయ్య & సన్, మర్చంట్ ,, ,,

60. ఏడిద సూర్యనారాయణమూర్తిగారు, ,, ,,

61. రాయపురెడ్డి అప్పారావుగారు, ,,
వైస్ ఛైర్మన్ ,,

62. పొట్టా వీరరాజుగారు ,, 116

63. నుదురుపాటి వీరరాజుగారు శిర్లపాలెం ,,

64. శారదా గ్రంథాలయము ,, ,,

65. పోలిశెట్టి వేం. రమణయ్యగారు (రాజా)
కమీషన్ మర్చంట్స్, విజయనగరము ,,

66. మాటూరి లింగమూర్తిగారు,
క్లాత్ మర్చంట్స్ ,, ,,

67. మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు,
గజపతినగరము 116

68. ఆడక్కి వేం. కృష్ణ హనుమంతరావుగారు,
శ్రీకాకుళము 100

69. కొత్తా రమణాజీరావుగారు,
కమీషన్ మర్చంట్స్, బొబ్బిలి ,,

70. గైనేడి వేం. అప్పారావుగారు L.M.P.
హైదరాబాద్ ,,

71. వీరమనేని గోపాలరావుగారు,
డిప్యూటీ డైరెక్టర్ సివిల్ సప్లయిస్ ,, ,,

72. శ్రీ వి. యస్. వారణాసిగారు, రిటైర్డు
అసిస్టెంట్ స్టేట్ కమీషనర్, హైదరాబాద్ 116

73. యస్. వేణుగోపాలరావు, రిపోర్టర్,
లెజిస్లేచర్ సెక్రటరైట్ ,, 100

74. కనకదండి భాస్కరరావుగారు, B.Sc,
ఇన్‌కంటాక్స్ ఇన్స్పెక్టర్ ,, ,,

75. నిట్టు ఫేమశంకరరంగారు, రిటైర్డు
ఇన్‌కంటాక్స్ ఆఫీసర్ ,, ,,

76. నంగునూరు మహబూబు రెడ్డిగారు,
దేశముఖ్ వరంగల్ ,,

77. మహమ్మద్ రహీంతుల్లాగారు, M L.A.,
మున్సిపల్ ఛైర్మన్, కడప ,,

78. రామకృష్ణ సమాజ గ్రంథాలయము, ,, ,,

79. రాపూరు రంగనాథంగారు, అడ్వొకేట్ ,, ,,

80. రాజా పోలేపల్లె వెంగన్న శ్రేష్ఠిగారు,
వల్లూరు ,,

81. ముత్యాల లక్ష్మయ్యశెట్టి & సన్స్,
కమీషన్ జనరల్ మర్చంట్స్, తిమ్మనచర్ల ,,

82. జూటూరు దాసప్ప & సన్స్,
జనరల్ మర్చంట్స్ ,, 101

83. యన్. నాగప్పగారు, స్కిన్ మర్చంట్స్ ,, 100

84. కె. వి. లక్ష్మయ్యశెట్టిగారు,
జనరల్ మర్చంట్స్ ,, ,,

85, శ్రీ యన్. యమ్. నాగప్ప & సన్స్
టింబర్ మర్చంట్స్ తిమ్మనచర్ల 100

86. టి. యం. సి. నాగప్ప & బ్రదర్స్,
నాగేశ్వర టింబర్ డిపో ,, ,,

87. యస్. కొమరప్ప & సన్స్,
బ్యాంకర్స్, బళ్ళారి ,,

88. కె, లక్ష్మీపతి & సన్, కమీషన్
మర్చంట్, బళ్లారి 105

89. కె. సన్న ఓంకారప్పగారు,
మర్చంట్, ,, 101

90. ఐ. వేంకటరత్నం నాయుడుగారు,
L. M. P, ,, 100

91. జయంతి రుద్రయ్య శెట్టిగారు,
బ్యాంకర్స్, రాయదుర్గం ,,

92. చిందనూరు నాగప్ప శెట్టిగారు,
కమీషన్ మర్చంట్స్, ,, ,,

93. తల్లం హనుమంతప్ప శెట్టిగారు,
కమీషన్ మర్చంట్, ,, ,,

94. టి. రాజశేఖర రెడ్డిగారు, అలంపురము ,,

95. రావుబహదూర్ టి. ఆర్. రామచంద్ర
శాస్త్రిగారు, అడ్వొకేట్, కర్నూలు ,,

96. గీతా సేవాసమితి, కల్యాణదుర్గము ,,

7. మలగూరు సంజీవప్పగారు, కనగానపల్లె ,,

98. శ్రీ గంటి ఎ. శాస్త్రిగారు, M. Sc., Ph. D.
వెటిరినరీ కాలేజ్, తిరుపతి ..

99. ఎ. యం. ఓబిలాపతి శ్రేష్ఠిగారు,
B. com., B. L , F. S. A .A.,
ఇన్‌కంటాక్స్ ప్రాక్టిషనర్, అడ్వొకేట్,
మద్రాసు 101

## పోషకులు

1. శ్రీ ఎలిశెట్టి సుబ్బారాయుడుగారు, గోల్డ్ మర్చంట్స్,
నెల్లూరు, రు. 58
2. వెలగపూడి సుందరరామదత్తు గారు, .. 50
3. పసుమర్తి సుబ్బరాజుగారు, G.D A., F.G.A.,
ఆసిస్టెంట్ మానేజర్, ఇన్సూరెన్స్ కార్పొరేషన్
ఆఫ్ ఇండియా, బొంబాయి ..
4. గట్టె సత్యనారాయణ గుప్తగారు,విద్వాన్, విజయవాడ ..
5. తుమ్మల వేంకటేశ్వరరావుగారు, భీమడోలు ..
6. కొండ ఈశ్వరరాజుగారు, గుండుగొలను ..
7. ఉనికిలి వేంకటరాజుగారు, .. ..
8. నుదురుపాటి సత్యనారాయణగారు, భీమునిపట్నము 58
9. పూసర్ల జు॥ అప్పల నరసయ్యగారు, టింబర్
మర్చంట్స్, విజయనగరము ..
10. తాయి మల్లిఖార్జునప్ప శెట్టిగారు, రాయదుర్గం 50



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## సర్వ సిద్ధాంత సౌరభము

సర్వ సిద్ధాంత సౌరభము అను మహాగ్రంథమును పదు నారు సంపుటములలో శ్రీ అనుభవానందులు రచించినారు. ఇందు భారతీయ తత్త్వశాస్త్రము వేదములనుండి జనించి ఎట్లు పరిణమించినదో వ్రాయబడుటమేగాక, ప్రాచీన మహర్షులచే దెలుపబడిన తత్త్వవిషయములకు ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్ర విషయములకుగల అనేక సామ్యములు వివరింపబడి యున్నవి.

ఈబృహద్గ్రంథము (1) దర్శన (2) అద్వైత (3) వైష్ణవ (4) శైవ-శాక్త (5) బౌద్ధ (6) సమన్వయము లనబరగు ఆరు ఖండములుగ విభజింపబడినది. అందు (1) సాంఖ్య, యోగ (2) వైశేషిక, న్యాయ (3) మీమాంస, వేదాంతము లనబడు మూడు భాగములతోగూడిన దర్శనఖండము; (1) శ్రీశంకరపూర్వ (2) శ్రీ శంకర (3) శ్రీ శంకరానంతర అద్వైతము లనబడు మూడు భాగములతోనున్న అద్వైత ఖండము ముద్రితములు. (1) విశిష్టాద్వైత (2) వైష్ణవము లనబరగు రెండు భాగములతోగూడిన వైష్ణవఖండము ప్రకటింపబడుచున్నది.

ప్రస్తుతము ప్రకటితమైన ఆరు సంపుటములగూర్చి విద్వద్ మహాజనుల అభిప్రాయముల గొన్నింటి జూచెదము గాక !

# అభిప్రాయములు

1. జీయాదాచంద్రతారార్కం సర్వ సిద్ధాంత సౌరభం ।
మూర్ఛి తాధ్యాత్మ చైతన్య సంజీవన మహౌషధిః ॥
కవి శిరోభూషణ శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు.

2. ఈ కాలమునకు తగురీతి అధ్యాత్మశాస్త్రములలో రుచి పుట్టించును.

—జగద్గురు శ్రీశ్రీశ్రీ శృంగేరీ పీఠాధిపతులు.

3. An encyclopaedia of Indian Philosophy in Telugu.

—జగద్గురు శ్రీశ్రీశ్రీ కామకోటి పీఠాధిపతులు.

4. మహాగ్రంథము రచించినారు. —సాహిత్యసామ్రాట్
శ్రీశ్రీ శివశంకరస్వాములవారు.

5. ఎట్టిగ్రంథ మొకటి ఆంధ్రులకు కావలయునని అనుకొంటినో యట్టి దిదియ.

—శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

6. అది బృహత్తరమైన గ్రంథం. విశ్వకోశం.

—డాక్టరు వి. యన్. శర్మగారు. Ph.D.

7 I received your book and read it with interes t.

—డాక్టరు ఎస్. రాధాకృష్ణన్‌గారు

8. మహాప్రయత్నము ఫలించిన రచన.

—పండిత శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

9. It appeared to be very interesting.
—డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు.

10. ఈ గ్రంథము నాస్తికులకు వాగ్బంధము. ఆస్తికులకు చిద్విలాసము. —కవిశిరోభూషణ
శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు.

11. సిద్ధాంతవివేచనముతో సిద్ధాంత వివేకమునే ప్రసాదించును. —దర్శనాచార్య
శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు.

12. గొప్ప విమర్శకగ్రంథం. పరమ ప్రామాణికం.
—ఆంధ్రప్రభ.

13. పేరుకు తగినట్లు ఇదినిజంగా సర్వ సిద్ధాంత సౌరభం.
—ఆంధ్రపత్రిక.

14. ఆంధ్రలోకమున కొక అమూల్యమైన పెన్నిధి.
—కృష్ణా పత్రిక.

15. మతము-దాని ఆవశ్యకత అనే సమస్యపై కలుగు సందేహములను తీర్చగలది ఈగ్రంథము.
—గోలకొండ పత్రిక.

16. ఈ గ్రంథము దర్శన విషయముల నెఱుంగగోరువారికి రసగుళిక. —ఆరాధన.

17. The venerable author - - - combines in himself knowledge and wisdom and spiritual experience of the high-

est order and is giving us a vistion of unified dynamic intigral Hinduism.

—Sri K. S. Ramaswami Sastri.

18. వాచామగోచరమైన పరిశ్రమతో ఊహాతీతమైన బోధనా శక్తితో ప్రాచ్య పాశ్చాత్య తత్త్వ రహస్యములను సవ్యసాచులుగా వెల్లడించిన శ్రీ అనుభవానందులు ఆంధ్ర విపశ్చిల్లోక కృతజ్ఞతాపాత్రులు.

—వాఙ్మయ మహాధ్యక్ష
శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు.

19. అనుభవయతిరాజ స్సారవా క్సారభేయా
పరమ మధురదుగ్ధా త్తత్తదాచార్య నీతం
అనుభవ నవనీతం సర్వ మద్వైత తంత్రం
బుధ తతి మతి పాత్రే ముక్తహస్త దదాతి.

—శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

20 — I read the books which you sent me. I am delighted that such important information is made available to Telugu readers.

—Dr. S. Radhakrishnan.

# సాధన రహస్యము

1. అష్టాంగయోగము...సాధనచతుష్టయ రహస్యాలు ఈ గ్రంథంలో సర్వులకు బోధపడే రీతిని వివరింప బడినవి. —ఆంధ్రప్రభ.

2. 'సాధన రహస్యం' సాధక కల్పతరువు. ఈ గ్రంథం లోని ప్రత్యక్షరంలోనూ శ్రీమ దనుభవానందులు అనుభవానందులుగా ప్రత్యక్షమౌతూ... సాధన రహస్యాన్ని బోధిస్తున్నట్లు గుర్తించి అనుభవానందం పొందవచ్చు. —ఆంధ్రపత్రిక.

3. పెద్దలమనుకొనేవారుకూడా పిన్నలై కూర్చుండి విన వచ్చు... ఆధ్యాత్మిక సాధన రహస్యములను వీరిం దులో వెన్నముద్దలూ, గుజ్జెనగూళ్ళుచేసి తినిపిస్తున్నారు. —కృష్ణా పత్రిక.

4. సాధకుని కవసరమైన సర్వవిషయాలూ పండొలిచి చేతిలోపెట్టినట్లు స్వాములవారు మనకిచ్చియున్నా రీ గ్రంథములో. —ఆరాధన.

5. 'సాధన రహస్యము' కంటె ఆత్మసాక్షాత్కార మార్గ మును నిష్కర్షగా వివరముగా తెలుపు గ్రంథము దుర్లభము...

—పండిత శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

6. సాధనారహస్యము చదువ మొదలిడుటమే నావంతు. చివరంట దీసికొనిపోవుట దానివంతు. తాము భిక్షువులు.

తమ సాధనా రహస్యము చదివినవారు తమ విజ్ఞానము నకు అనుభవమునకు భిక్షువులు.

—శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

7. ఈ గ్రంథము 'వాఙ్మయగురువు' అనవచ్చును.

—శ్రీ శుద్ధ చైతన్యస్వాములవారు.

8. సాధన రహస్యము అమూల్యము, ఎన్నిమారులు చదివి నను యింకను మరి మరి చదువవలయుననియే కోరిక ఉండును, ఇట్టి గ్రంథమును చదివినవారే ధన్యులు.

—డాక్టరు వి. యన్. శర్మగారు, Ph. D.

9. మహత్తరాంశముల నింత సులభముగా దెలుపు గ్రంథ మింత వరకు వెలువడలేదు.... జిజ్ఞాసులోకమునకు మరపురాని ఉత్సాహము, ఉద్వేగమును కలిగించిరి.

—శ్రీ సత్యానంద స్వాములవారు

10. శాస్త్రజ్ఞానము లేనివారు శాస్త్రమును గ్రహించి తమ అధ్యాత్మ విద్యను అభివృద్ధి చేసికొనన యీ గ్రంథము అత్యంత సహకారి.

—శ్రీశ్రీశ్రీ శృంగేరీ పీఠాధ్యక్ష మహాస్వాములవారు

---

# ప్రాచీన భగవద్ గీత

## ఉపోద్ఘాతము

### గీతా ప్రశస్తి

గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥

శ్రీభగవద్గీతా తాత్పర్య శ్రవణాభిలాషగలవాడు, మహాపాపాత్ముడై యున్నను, వైకుంఠమునుబొంది అందు శ్రీమహావిష్ణువుతోసహ ఆనందించును. అంతియగాక నట్టివాడు సశరీరుడై యుండుకాలమున 'జీవన్ముక్తస్స విజ్ఞేయః' జీవన్ముక్తుడుగ బరిగణింపబడును. వాడు నిస్సంశయముగ నిర్ధూతకల్మషుడై విరాజిల్లువా డగుటయే యిందులకు గారణము.

శాస్త్రముల ననేక గ్రంథభాగములు గీతా నామమును ధరించి, శివగీత, దేవగీత, గణేశగీత, రామగీత, భ్రమరగీత, ఉద్ధవగీత, ఉత్తరగీతాదిక రూపముల వ్యాపించియున్నను, వానినన్నింటి నధిగమించు కీర్తికాంతి ప్రకాశవంతమై, సుప్రశస్తమై, పూర్వోక్తరీతి నభ్యాసరతులకు సుఖ శాంతుల బ్రసాదించు సర్వశక్తిమయి యీ గీతయందు బ్రత్యేకత ఏమి ? సర్వవేదమయుడు హరి; సర్వతీర్థస్వరూపము గంగావాహిని; సర్వధర్మసంపూర్ణము మనుధర్మశాస్త్రము; అటులే సర్వశాస్త్రమయము శ్రీ గీతాశాస్త్రము. పైవాని సమానస్థాన

మున అసాధారణ పూజ్యస్థానము నీ గ్రంథము అధిష్ఠించుట యందు విశేషమేమి ? సర్వేతరములు సామాన్య 'గీతా' పదముచే వ్యవహరింపబడుచుండ నియ్యది అద్వితీయముగ 'భగవద్గీతా' వ్యవహారమునొంది ప్రఖ్యాతి గాంచుటలో రహస్యమేమి ?

## భగవద్గీత ప్రత్యేకత

ఉపనిషచ్ఛాస్త్రముల శాసింపబడినచందము 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' శాస్త్రజ్ఞాన బ్రహ్మజ్ఞానములు నాబడు పరోక్షాపరోక్షజ్ఞాన విభూషణాలంకృతిచే అజ్ఞానాంధవిచ్ఛేదనా శక్తి సంపన్నుడైన గురుపుంగవుడై, మరియు 'ఏకో దేవో దేవకీ పుత్ర ఏవ' యనునట్లు దేవదేవేశ్వరుడైన శ్రీ కృష్ణ పరమాత్మయే యీ గీతాశాస్త్ర మహోపదేష్ట యగుటయే యిందలి మాహాత్మ్యము. అంతియగాక సర్వవిధద్రైవీగుణసమోపేతుడై సన్నిహితుడై, సదా అనుచరుడై, సమర్థుడైయుండియు యుద్ధరంగమున నాహూతికాబోవు ఆచార్య పితర పుత్ర పితామహాది సర్వవిధ బంధుకోటిని దిలకించి, నెల్లర స్వజనదృష్టి గాంచి సర్వమారణతంత్రమైన యుద్ధమును యోచించి, కృపయావిష్టచిత్తమున, స్పందితహృదయమున, బశ్చాత్తప్త మానసమున, సర్వశస్త్రాస్త్ర త్యాగముగావించి, యుద్ధమున కురుకుటయా, విరమించుటయాయను సంశయాగ్నిబడి, తన్నివారణమునకు, గర్తవ్యశాసనమునకు సంపూర్తిగ శ్రీకృష్ణ శరణాగతినొంది 'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం' అనుచు బరమాత్మని బాదాక్రాంతుడైన అర్జునుడిచట శిష్యస్థానము నలంకరించి యుండుటయు మహత్తర విశేషము.

పూర్వోత్తరచారిత్రమున, ఉద్ధవ అక్రూర పార్థాదులకు శ్రీ కృష్ణుడు అనేక పారమార్థిక విషయముల బోధించి యున్నను, యీ సందర్భమున గురుశిష్యులు పరిస్థితుల ననుసరించి, తమసంపూర్ణాధికారముల నభివ్యక్తము గావించి, 'చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోర్జునం। వేదత్రయీ పరానందాతత్త్వార్థజ్ఞానసంయుతా॥' గీతాశాస్త్రము వేదత్రయసారము. అది తత్త్వార్థజ్ఞాన సంయుతము. సచ్చిదానందరూపుడైన శ్రీ కృష్ణపరమాత్మయే దీని అర్జునునకు స్వయముగ బోధించెను అని కీర్తి నార్జించినది. సందర్భముననుసరించి శ్రీకృష్ణుడు తన నిజతత్త్వమును బ్రకాశించి, పరమార్థమును బోధించి, నిజస్వరూపమునుగూడ అర్జునునిచే దర్శింపజేసిన అపూర్వ స్థితులకు నెగసిపోవుటచే నిది అనుపమానమై భగవద్గీతా అను ప్రత్యేక నామ వ్యవహారమును గడించెను.

అందుచేత 'సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః। పార్థో వత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥' అని శేర్వ ఉపనిచ్ఛాస్త్రసారము గీతగ బ్రఖ్యాతమై, సర్వశాస్త్రమయముగా బరిగణింపబడును, 'ఏకం శాస్త్రం దేవకీపుత్ర గీతం' అనియు గీర్తింపబడుచున్నది, గీతా పఠన మాహాత్మ్యమున సర్వపాపపరిహారము కలుగును అచట సర్వతీర్థములు వెలుగొందును. సకల మహాత్ములకాకరమై సర్వదేవతా నివాసమై, సర్వముముక్షుజన ఉపాసనా మహామంత్రమై యీ భగవద్గీతాశాస్త్రము ప్రకాశించుట అందుచే సహజమేగదా !

# గీతాసందర్భము-ఔచిత్యము

కురుపాండవ రాజ్యపాలన సందర్భమున గలిగిన అభి ప్రాయభేదముల ననుసరించి చెలరేగిన మహాయుద్ధమునకు బూర్వము సర్వసైన్య సన్నాహము నంపూర్తిగాంచి, సైన్య ములు ముఖాముఖి నెదుర్కొననున్న ముహూర్తమునకు బూర్వము, పాండవసైన్యమునకు బ్రముఖుడైన అర్జునుడు, శ్రీకృష్ణ సారథ్యమహాభాగ్యము సంప్రాప్తింప ఉభయసైన్య ములమధ్య నిలిచి, యిరుప్రక్కల నవలోకించి, చింతించి, హృదయముద్రవింప రణరంగమునుండి విరమించుట కుద్య మింపగోరి శ్రీకృష్ణునర్థింప నీ గీతాశాస్త్రము ఉద్భవించెను. సందర్భము యుద్ధము, కాని ప్రసంగము పారమార్థికమిశ్రిత వ్యవహారము. గురుశిష్యులిరువురు సర్వశాస్త్ర పారంగతులు, ఉపాసకులు, అనుభవశీలురు. శ్రీకృష్ణుడు చిన్ననాటనుండి అజేయ పారమార్థిక సంపన్నత ప్రవర్ధమానుడై, అడు గడుగునకు దన నిజస్వరూప విస్మృతిలేని స్థితి విరాజిల్లు చుండుటచే సమయము ననుసరించి దన నిజవ్యక్తిత్వ ప్రద ర్శనము జరుగుచుండెను. అటులనే యిచటగూడ శ్రీకృష్ణుని సంపూర్ణ పారమార్థిక సహజస్వరూపము అభివ్యక్తమై, అంతర్గత ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానప్రవాహము ప్రశయ రూపముదాల్చి, వెల్లుటికి అర్జునుని ముంచెత్తినది. అవసరము ననుసరించి కాలనిర్ణయము అనావశ్యకముగదా! సత్ఫలితమే ప్రధానముగాని కాల మెంతైన నేమి? అట్టి క్లిష్టత్వమునుండి శ్రీకృష్ణార్జునులు బయట బడినవిమ్మట గదా యుద్ధ ప్రారం భము! అందుచే నిరువురకు ముఖ్యమై, హృద్యమునైన

పారమార్థిక తత్త్వవిచారణామూలమున వ్యావహారిక క్లిష్టత్వము పటాపంచలై సర్వసామాన్యమునకు, విధినిర్వహణా సంస్థితికి సానుకూల్యమేర్పడినది. ఈవిధముగ నీ గీతా శాస్త్రము పారమార్థిక వ్యావహారికముల సన్నిహితమొనరించి, పారమార్థికదృష్టితో వ్యావహారిక జీవన నిర్వహణమును బోధించి, సర్వ వ్యవహారముల కంతర్గత పారమార్థికానుభూతికి విశాలావకాశము నొసంగుచున్నది. అందునుగూడ నీ శాస్త్రము అపూర్వమే యగుచున్నది.

## మహాభారత తాత్పర్యము

గీతాశాస్త్ర మాహాత్మ్యమును గ్రహించి 'అచతుర్వదనో బ్రహ్మాద్విబాహు రపరోహరిః।అఫాలలోచనో శంభుః భగవాన్ బాదరాయణః॥' చతుర్ముఖములు లేకున్నను బ్రహ్మదేవుడును, బాహుద్వయముమాత్రము గలిగియున్నను విష్ణువును, త్రినేత్రములేకున్నను పరమశివుడైయున్న వ్యాసభగవానుడు పంచమ వేదము నా కీర్తిగాంచిన శ్రీమద్ మహాభారత కావ్యరచనము నొక లక్ష శ్లోకసంఖ్యా పరిమితి నిర్మించుచు, అష్టాదశ పర్వములలో భీష్మపర్వ ప్రారంభమున నిరువదియైదునుండి నలువదిరెండు అధ్యాయములవరకు నీ భగవద్గీతా శాస్త్రమునకు ప్రముఖస్థానము నొసంగి అష్టాదశాధ్యాయినిగ రూపొందించి చేర్చియున్నాడు. యుద్ధ ప్రారంభమునకు పూర్వము భగవద్గీతాశాస్త్రమును, మహాభారత యుద్ధానంతరము భీష్మముఖనిపాత సర్వధర్మోపదేశ సంపూర్ణ శాంతి పర్వమునుబొదిగి, సంపూర్ణ మహాభారత తాత్పర్యము లౌకికముగాక ధార్మిక పారమార్థిక జీవనవికాసమే యుని

వ్యాసభట్టారకుడు నిర్ణయించియున్నాడు. అదియే మహాభారత జాతి హృదయమనియు నాతని నిశ్చయము.

## గీతా - శ్రీశంకరులు

ఉద్భవించినదాది నీ గీతాశాస్త్రము కాలవాహినిబడి పరుగిడుచు, నెట్టి రూపాంతరముల నొందెనో అనూహ్యము. చరితాకథన విదూరము. కాని క్రీ. పూ. 509 వ సంవత్సరమున జనించి, అపరశివస్వరూపుడై సర్వజ్ఞుడై, సర్వభారత సంస్కృతీ వాతావరణమును జ్వాజ్వల్యమానముగ ప్రకాశింప జేసిన శ్రీ శంకరాచార్యులు వైదికధర్మమున నుపనిషత్ప్రతిపాదిత పరబ్రహ్మతత్త్వ విచారణమునకై సర్వశాస్త్ర గవేషణము గావించి, సర్వోపనిషన్మథనము నొనరించి, తత్సిద్ధాంత ప్రచారమునకై గడంగెను. ఉపనిషత్తుల సిద్ధాంత ప్రతిపాదనమున నందందు గోచరించు సంశయ నివారణార్థమై పూర్వమే శ్రీ బాదరాయణవ్యాసునిచే నిర్మింపబడిన వేదాంత సూత్రములగూడ స్వీకరించెను. అంత సర్వసామాన్య ప్రజానీకమున కందుబాటుగ సిద్ధాంత ప్రవచనమున కనుకూల గ్రంథముగ మహాభారతాంతర్గత గీతా శాస్త్రమును గూడ శ్రీ శంకరులు స్వీకరించెను. అనగా స్వీయ అద్వైత సిద్ధాంతప్రచారమునకు శ్రుతి యుక్తి అనుభవము లావశ్యకము లగుటచే, శ్రుతిబద్ధముగ నుపనిషత్తులను, యుక్తి సమ్మతముగ బ్రహ్మసూత్రమును, అనుభవయుక్తముగ గీతా శాస్త్రమును గైకొని, వీనికి 'ప్రస్థానత్రయ'మని నామకరణమొసంగి, వానికి అజేయ భాష్యముల రచించి వివరించియుండెను. అతఃపూర్వమే యీగ్రంథములు ప్రఖ్యా

తములై, భారతీయ సాంఘిక వాతావరణమును నిండి, వ్యాప్తి సంపాదించి వివరణగ్రంథముల బొందియున్నను. సర్వజ్ఞుడై సర్వశక్తి స్వరూపుడైన శ్రీ శంకర భగవత్పాదాచార్య కృత భాష్యములు భానుకోటి ప్రకాశభూయిష్టములౌటచే, పూర్వ గ్రంథములు నక్షత్రములవోలె నదృశ్యములయ్యెను కాన నాటినుండి శ్రీ శంకరాచార్య కృతములే ప్రామాణికములై, కాలాంతర రచయితల కాధారములై వెలుగొందినవి. ఈ విధముగ శ్రీ శంకరానంతర భాష్యకర్తలైన శ్రీ రామానుజ మధ్వాది అసంఖ్యాక ఆచార్యులేమి పండితులేమి శ్రీ శంకర గ్రంథముల నాధారముగ స్వీకరించి, స్వస్వమతానుసార ముగ భాష్యముల లిఖించియుండిరి. అటుల శ్రీ శంకర భగవత్పాదునితో నీ శాస్త్రముల రూపములుగూడ నొక స్థిర త్వమునొంది నేటివరకు ప్రత్యక్షమగుట విస్పష్టము. అంతకు పూర్వముగల లిఖిత గ్రంథపాఠములు, తమ పాఠాంతర విభేదములతో, శ్రీశంకర హస్తస్పర్శచే ప్రఖ్యాతమై, దేశ వ్యాప్తమై యొప్పారిన సోదర గ్రంథములకు నెదురు నిలువ జాలక, ఆశ్రమ మఠ గ్రంథాలయ ప్రాచీన లిఖిత గ్రంథముల మధ్య మరుగుపడిపోయినవి. ఇందాశ్చర్య మావంతయును లేదు. మరియు నందు దురుద్దేశ్యముల నెవరియందు నాపా దింపజేయుటయు నసమంజసము. సువిశాల భరతఖండమున, అసంఖ్యాక భాషాసందోహములమధ్య, వివిధరూప అక్షర లిపుల విభేదముల ఇరుకున, అనేక అక్షరజ్ఞానశూన్య లేఖ కుల హస్తముల నీ ప్రాచీన లిఖిత గ్రంథసంచయ మెట్టి కష్టనిష్ఠురముల ననుభవించి ఎవ్విధ రూపాంతర పాఠాంత రముల దాల్చెనో ఎవరికెరుక !

# గీతా - 745 శ్లోకములు

ఇతర గ్రంథముల గాథ లెట్లున్నను భగవద్గీతా చారిత్ర మున నొక క్లిష్టత్వ మేర్పడియున్నది. మహాభారత గ్రంథ మున భీష్మపర్వమున 42 వ అధ్యాయములో భగవద్గీతా పాఠ మును బూర్తిచేసి, 43 వ అధ్యాయప్రారంభమున శ్రీ వ్యాస భగవానుడు ఒక శ్లోకమునుంచెను. భగవద్గీతా శాస్త్రమున ప్రస్తావితమైన వ్యక్తుల సూచించి, వారి వారి ముఖముల నెన్ని శ్లోకములు వచింపబడినవియో అందులేఖింపబడినవి. 'షట్శ తాని సంవిశాని శ్లోకానాం ప్రాహ కేశవః। అర్జునః సప్త పంచాశత్ సప్తషష్టిం చ సంజయః। ధృతరాష్ట్రః శ్లోకమేకం గీతాయా మానముచ్యతే' శ్రీకృష్ణుడు 620 శ్లోకముల వచింప, అర్జునుడు 57, సంజయుడు 67, ధృతరాష్ట్రుడు ఒక శ్లోకమును పలికియున్నారు. ఇదియే గీతయొక్క పరి మాణము. అనగా మొత్తమునకు 745 శ్లోకములు గీతా మాన ముగ నిందు స్పష్టము. కాని ప్రస్తుతము ప్రచారముననున్న గీతాగ్రంథమున శ్రీకృష్ణునకు అన్వయించుచు 575 శ్లోక ములును,అర్జునునకు 84, సంజయునకు 40, ధృతరాష్ట్రునకు 1 శ్లోకము గలిగి మొత్తమునకు 700 శ్లోకములు మాత్రము గలవు. అనగ శ్రీకృష్ణునకు ప్రస్తుత గీతలో 45 శ్లోకములు తగ్గగ, అర్జునునకు 27 అధికమును, సంజయునకు 27 లోపించుటయు జరిగినది. ప్రస్తుత గీతలో అర్జునున కన్వ యించుచున్న శ్లోకములలో 27 సంజయునకు ప్రాచీనగీత అన్వయించియున్నది. శ్రీకృష్ణునకు 45 నూత్న శ్లోకముల జూపించియున్నది.

# ష్రాడర్ పండితుని కృషి

భగవద్గీతాస్వరూప పరిమాణ నిర్ణయమున నింత కలవర ములను పండితలోకమున గలుగజేసిన యీ మహాభారత శ్లోకమును అడయారు గ్రంథాలయాధికారిగ గొంతకాల ముండియున్న Dr. F.O. Schrader డాక్టరు ష్రాడర్ పండితుడు జర్మనీదేశములో కీల్ విశ్వవిద్యాలయాధ్యాపకుడై యుండి, భారతీయ సంస్కృత శాస్త్ర గవేషణార్థము భారత మున గొంతకాలముండి, యీశ్లోకమును దిలకించి, ప్రస్తుత గీతాశాస్త్రమున లోపించిన 45 శ్లోకములకై అన్వేషణమునకు గడంగెను. శ్రీ శంకరాది వ్యాఖ్యాతలు పూర్వమే యీ శ్లోకము నవలోకించియున్నను, వారి దృష్టి చారిత్రాత్మకము గాక స్వకీయ తత్వసిద్ధాంత ప్రతిష్ఠాపనాపరమగుటచే దమకు లభించిన గీతాస్వరూపము అందుల కుపయుక్తమై యుండు టయు, నందుచే లోపించిన 45 శ్లోకములు లేకున్నను దమ కెట్టి యపకారము వాటిల్లమిచే వారు గీతా పరిమాణము విష యమున తూష్ణీభావము వహించియుండిరని తోచును. అంత నా జర్మను పండితుడు ఆ 45 శ్లోకములకై యన్వేషించెను. నిర్ణయసాగర ముద్రణాలయమువారిచే బ్రచురింపబడిన గీతార్థ సంగ్రహమును అతడు చూచి, అది 745 శ్లోకములతోనుండి గీతాగ్రంథము ననుసరించి లిఖింపబడినట్లు ప్రథమతః నతడు తీర్మానించెను. అదియు గాశ్మీర సాంప్రదాయిక పాఠముగ నాతని నిర్ణయము. అంతటితో నూరకుండక నా పండితుడు బ్రిటిషు మ్యూజియములోనున్న ఆ గీతాగ్రంథ మూలమును గ్రహించి, కాశ్మీరదేశీయుడైన అభినవగుప్తయొక్క గీతావ్యాఖ్యా

నము ఆగీతాపాఠముపై నాధారము అనియు నిశ్చయించెను, గీతాశాస్త్రముపై సర్వతోభద్రుని వ్యాఖ్యనుగూడనాతడు సంపాదించి, రోమను లిపిలో నా ఓటో ష్రాడర్ ఆచార్యుడు కాశ్మీర సాంప్రదాయిక గీతాశాస్త్రమును ప్రకటించెను. ఈ ప్రచురణము పండితలోకమున చైతన్యమును రేకెత్తించి వివిధరూప గవేషణాయత్నమునకు నాంది వాడియుండెను.

## కాశ్మీర గీతాపాఠములు

ప్రాచీనగీతా ప్రచురణకర్తయైన రనేశ్వరాచార్య శ్రీచరణతీర్థుల అభిప్రాయమున ముఖ్యముగ నైదు గీతాపాఠములు 745 శ్లోకముల గీతాగ్రంథమును సూచించుచున్నవి. (1) శ్రీ మహేశ్వరాచార్య రజనక అభినవగుప్తాచార్యుని కాశ్మీర సాంప్రదాయిక 'గీతార్థసంగ్రహము' 1934సం॥ ప్రకటితము. (2) ఆచార్య ఓటో ష్రాడరు పండితుడు 1912 వ సంవత్సరమున రోమను లిపిలో ప్రకటించిన గీతాశాస్త్రము. (3) భాండార్కర్ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటునుండి. కాశ్మీర సంప్రదాయము ననుసరించి శ్రీ తద్పత్రికార్ మహాశయునిచే ప్రకటింపబడిన గీత. (4) సుమారు 1956 వ సంవత్సర ప్రాంతముల కలకత్తా నగరమున శ్రీ శంకర, ఆనందగిరి, శ్రీధరుల భాష్యములతో ప్రకటింపబడిన గీతాగ్రంథము.(5) సర్వతోభద్రుని వ్యాఖ్యానముతో 1939 వ సంవత్సరమున ఆనందాశ్రమ ముద్రణాలయము ప్రకటించిన గ్రంథము. అభినవగుప్తాచార్యుని భాష్యముతో శ్రీనగరమున ప్రచురింపబడిన కాశ్మీర సాంప్రదాయిక గీతాగ్రంథము చాలముఖ్యమని శ్రీచరణతీర్థుని తాత్పర్యము.

# అరబ్బీ పార్సీ అనువాదములు

అంతియగాక పదునొకండవ శతాబ్దమునకు జెందిన అల్బరూని అను పండితుడు తన 'Al Beruni in India' 'హిందూదేశమున అల్బరూని' అను అరబ్బీగ్రంథమున గీతా ప్రమాణముల బెక్కుగైకొనియుండి, గీతా గ్రంథమున 745 శ్లోకములు గలవని వ్రాసెనట. మహమ్మదీయ నవాబులపాలన కాలమునగూడ నీ గీతాశాస్త్రము అరబ్బీ పర్షియా భాషల లోనికి అనువాదముల బొందెను. అందు Abul Fazl అబుల్ ఫజల్ అను పండితుడు చక్రవర్తి ఆన ననుసరించి గీతా శాస్త్రము ననువదించెను. అందు 745 శ్లోకములుగలవు. మరియు నతని సోదరుడు Faizi ఫైజికూడ నొక అనువాదమును పద్యరూపమున గావించెనట. పర్షియా భాషలో Shah Ali Dastager షా ఆలీ దస్తగిర్ అను పండితుడుగూడ గీతా అనువాదమును పద్యరూపమున గావించెను. ఇందుగూడ అధిక శ్లోకములు గోచరము. అబుల్ ఫజల్ తన గీతా అనువాద సమాప్తమున గీతా శ్లోకసంఖ్యను దెలుపుచు, శ్రీకృష్ణునకు 605, అర్జునునకు 57, సంజయునకు 67, ధృతరాష్ట్రునకు 16 శ్లోకములనియు వాకొనెను. ఇవి మొత్తమునకు 745 శ్లోకము లగుచున్నవి.

ఈవిధముగ గీతాపాఠములు 745 శ్లోకములతో బ్రచారమున గాననగును పైపాఠములన్నియు నధికముగ కాశ్మీర పాఠము ననుసరించియున్నట్లు దోచును. శ్రీశంకరునకు లభించిన గీతాపాఠము దక్షిణాపథమున లభించియుండునేమో! అనగా కాశ్మీరపాఠము ప్రాచీనత్వమును గోల్పోవక, యథా

పూర్వస్థితి నుండ నన్యపాఠము దేశమున ననేక రూపాంతర ములనొంది, శ్రీశంకరుమూలమున నొక ప్రసిద్ధరూపము దాల్చి యుండునేమో అనియు దోచును.

అయినను పూర్తిపాఠముకొరకు పండితలోకమున 1912 ఓటో ష్రాడర్ పండితుని 'గీతార్థ సంగ్రహ' ప్రచురణముతో అన్వేషణము ప్రారంభమయ్యెను. అభినవగుప్తుని 'గీతార్థ సంగ్రహము' అసంపూర్ణము క్లుప్తమునై గీతాశ్లోకముల బూర్తిగ నొసంగదయ్యెను, అటులే ఆల్బెరూని గ్రంథము గీతాశ్లోకముల సూచించునుగాని గీతాపాఠముల దెలుపదు. అన్యములు గీతాశ్లోకపాఠములులేని అనువాద గ్రంథములు. అందుచే పై గ్రంథములెల్ల గీతాశాస్త్రమున 745 శ్లోకములు మహాభారతము ననుసరించియున్నట్లు తెలుపుచున్నవిగాని శ్లోకముల నొసంగజాలనివయ్యెను.

## వ్యాసశ్లోకము ప్రక్షిప్తమా?

కాని కొందరు పండితులు గీతా శ్లోకసంఖ్యను వచించు చున్న మహాభారత శ్లోక యాథార్థ్యమునే శంకించి దాని ప్రక్షిప్తమని వాకొనిరి. 745 శ్లోకములుగల గీతాగ్రంథమే లభింపకున్నచో నా వాదము సత్యమనిపించునుగాని. అట్టి గీతాపాఠములు లభింప నా వాదము అసమంజసము. అట్లైనచో గీతాశాస్త్రమున ద్వితీయాధ్యాయమే సత్యమున గీత యనియు శేషగ్రంథమంతయు ప్రక్షిప్తమే యనువారును గలరు. అటులే గీతాగ్రంథమంతయు మహాభారతమున ప్రక్షిప్త మనువారును గలరు. మరియు శ్రీ కృష్ణావతార చారిత్రకత్వ

మునుగూడ శంకించి కల్పితమను విమర్శాగ్రేసరులును లేక పోలేదు. అందుచే ప్రఖ్యాతముగనున్న ప్రస్తుత గీతాపాఠమున కన్యముగ నున్నదనుకారణమున నా శ్లోకమును ప్రక్షిప్తమని వాదించుట అసమంజసము. ప్రక్షిప్తముగ నా శ్లోకమును మహాభారతమున నిరికించువారి తాత్పర్యముగాని ప్రబల ప్రయోజనముగాని ఏమాత్రము కానుపింపదు. కాన నా శ్లోకము గీతాధ్యాయములగాక 43 వ అధ్యాయమున నుండుటచే రూపాంతరమునొందక నటులే యుండియుండ వచ్చును. కాని ముఖ్యగ్రంథమై, మహాభారతమున భీష్మపర్వము 22 నుండి 42 అధ్యాయములవరకు వ్యాపించి యున్న యీ గీతాశాస్త్రము, విషయప్రాధాన్యము ననుసరించియు, శ్రీకృష్ణ భక్తి, దేశమున నధిక ప్రాముఖ్యతను గడించి వ్యాపించుకొలది ఎల్లర దృష్టుల నాకర్షించి, అసంఖ్యాక హస్తముల జారి, రూపాంతరముల బొందియుండవచ్చు ననుట సముచితము.

## శుద్ధ ధర్మమండలి గీత

పూర్వము వివరింపబడిన కాశ్మీర గీతాపాఠము అటులుండ, మద్రాసు నగరమున శుద్ధ ధర్మ మండలి అను సంఘమువారు 1917 వ సంవత్సరమున 745 శ్లోకముల గీత నొకదాని ప్రచురించిరి. మండలి వారికి యీగ్రంథపాఠము అతి ప్రాచీన లిఖిత గ్రంథముగ లభించినదనియు, నద్దాని వ్యాఖ్యాతయైన హంసయోగి 15 వ శతాబ్దమువాడనియు వారు వాకొనిరి, కాని యీ గీతాపాఠము సంపూర్ణముగ నపూర్వము అనిపించును. ఇది అష్టాదశాధ్యాయిని అని ప్రసిద్ధమైన గీత,

ఇరువదియారు అధ్యాయములచే నలంకృతము గాయత్రీ మంత్రాక్షరములు 24 యై, 6 అక్షరములతో 4 భాగములుగ నున్నవనియు, నందుచే నీ గీతాశాస్త్రముగూడ 24 అధ్యాయములతో రాజిల్లి, అందు ఆరు ఆరు అధ్యాయములతో భాగ చతుష్టయము గలదనియు, నిదియే సాంఖ్యసిద్ధాంతము ననుసరించి చతుర్వింశతి తత్వములుగాన గీతయు నిరువదినాలుగు అధ్యాయముల నుండుట జరిగినదనియు మండలివారి వివరణము. వాల్మీకి మహర్షి కృత రామాయణము గాయత్రీ మంత్రము ననుసరించియే 24 కాండములతో నుండుట స్పష్టముగాన, నిదియు 24 అధ్యాయముల గ్రంథముగ గీతను మండలివారు సమర్థించిరి. అందుచేతనే మహాభారతము గూడ 24 వేల శ్లోకములతో నుండెనని ఆదిపర్వపాఠముగ వారి వాదము. ఈ 24 అధ్యాయములకు నుపోద్ఘాతముగ ప్రథమాధ్యాయమును, పర్యవసానముగ నిరువదియారవ అధ్యాయమును జేర్చి మండలి కాదర్శపురుషుడైన హంస యోగి యీ గీతాగ్రంథమును రూపొందించెను.

అయినను యీ గీతాసంకలనమున గొన్ని దోషము లున్నట్లు పండితులు తలంచిరి. ప్రస్తుతవ్యాప్తమై 700 శ్లోకములుగల గీతాపాఠమునుండి 663 శ్లోకములు మాత్రము గైకొనబడి 37 శ్లోకములు త్రోసివేయబడినవి. 745 శ్లోకముల బూర్తిచేయుటకై 82 శ్లోకములు మహాభారతమున నన్నిపర్వములనుండి నేకరింపబడి గీతాపాఠమున నందందు జేర్చబడినవి. ప్రథమమైన గీతావతార నిరూపణాధ్యాయమున 54 శ్లోకములుండి, భీష్మపర్వమున 23 వ అధ్యాయమున గల దుర్గాస్తుతి యిందు జేర్చబడి, అర్జునుని ముఖతః వచింప

బడియున్నది. 2 నుండి 25 అధ్యాయములవరకు శ్రీకృష్ణుడే ప్రధానవక్తయై ఒక్కొక్క అధ్యాయమున 24 శ్లోకముల నాతడు వచించును 26 వ అధ్యాయము 78 శ్లోకములు గలిగి అందు 31 శ్లోకములు శ్రీకృష్ణుని కన్వయించును. ఈ గీతాపాఠమున అధ్యాయముల నామములు క్రిందివిధముగ నున్నవి. (1) గీతావతారనిరూపణగీతా (2) నరనారాయణ ధర్మగీతా (3) అవతారగీతా (4) అధికారగీతా (5) శిక్షగీతా (6) కారణగీతా (7) కైవల్యగీతా (8) స్వరూపగీతా (9) సాధనత్రయగీతా (10) మాయాగీతా (11) మోక్షగీతా (12) బ్రహ్మస్వరూపగీతా (13) బ్రహ్మవిభూతిగీతా (14) ప్రాణాయామగీతా 15) పరమాత్మగీతా (16) అక్షరగీతా (17) రాజవిద్యాగీతా (18) పరమహంసగీతా (19) సంన్యాసగీతా (20) ఆత్మగీతా (21 ప్రకృతిగీతా (22) కర్మగీతా (23) భక్తిగీతా (24) జ్ఞానగీతా (25) యోగగీతా (26) బ్రహ్మస్తుతి. మరియు నీ గీతాశాస్త్ర మున నధ్యాయాంతమున 'ఇతి భగవద్గీతాసూం యోగబ్రహ్మ విద్యాయాం......అధ్యాయః' అనియు వచింపబడుచుండుట విశేషము. ఈవిధమున బ్రఖ్యాత గీతాశాస్త్రమునకు శుద్ధధర్మ మండలివారి గీతాపాఠము అనేకవిధముల విభిన్నత్వమును బ్రదర్శించుచున్నది. అందుచే నీ గీతాపాఠము విమర్శకుల సంస్తుతులబొందక నందుచే బ్రఖ్యాతము గాకపోయినది. దీనికి ప్రాక్పాశ్చాత్య పండితులెవ్వరును హర్షింపరైరి.

# జి. కె. శాస్త్రి కృషి

ప్రసిద్ధ గీతాశాస్త్రమున లుప్తమైన 45 శ్లోకముల నన్వే షించి, సంపూర్ణ గీతాశాస్త్రమును దేశమున కర్పింప తీవ్ర కృషి గావించిన పండితులలో కథియవార్ రాష్ట్రమున గోండాల్ నగర వాస్తవ్యుడైన రాజవైద్య జి కె. శాస్త్రి యనియు శ్రీచరణతీర్థులనియు ప్రఖ్యాతినొందిన మహాశయుడు ముఖ్యుడు. గోండాల్ నగరమున శ్రీ కేవలరామశాస్త్రి యీతని సంస్కృతాచార్యుడు. ఆ గురువర్యుని అధ్వర్యమున శాస్త్రముల పఠించి, శ్రీచరణతీర్థులు అనేక మహాభారత ముద్రిత, లిఖిత గ్రంథముల పరిశీలించెను. అన్నింట గీతా శ్లోకసంఖ్య 745 గనే ఆతనికి గోచరించెను. అందుచే గీతా శ్లోకసంఖ్య 745 గనే విశ్వసించి సంపూర్ణ గీతాపాఠమునకై యాత దన్వేషింపదొడంగెను. వారి రసశాల ఔషధాశ్రమ మునగల సరస్వతీ గ్రంథ భాండారమునగల గీతా లిఖిత గ్రంథముల నన్నింటిని పరిశీలించెను. ఆభాండారమున సర్వ శాస్త్రములకు జెందిన 17000 లిఖిత గ్రంథములు అనేక భాషలలో గలవు, అందు 155 గీతాశాస్త్రములుగూడ వ్రాత రూపమున గలవు. వానిలో గొన్నింట ననేక పాఠాంత రములు గోచరించెను. 1180 వ సంవత్సరము లిఖింపబడిన వ్రాతప్రతినుండి 1415 వ సంవత్సరమున మరల వ్రాసికొన బడిన యొక గీతాగ్రంథము అందు కనుగొనబడెను. అందు 720 శ్లోకము లుండుటయేగాక, ప్రస్తుత గీతకు 200 పాఠాం తరములతోనుండుట గ్రహింపబడెను చాలవరకు నిదియు కాశ్మీరపాఠము ననుసరించియున్నట్లు ఆపండితుడు గ్రహించి.

1936 వ సంవత్సరమున,శ్లోకము, గుజరాతీభాషలో తాత్పర్య వ్యాఖ్యానములతో నత డద్దాని ప్రచురించెను. 1937 వ సంవత్సరమున దాని నాంగ్లానువాదము 'చంద్రఘంటా'నామ వ్యాఖ్యానముతో మరల ప్రకటించెను.

## ప్రాచీన గీత

కాని యిదియు నసంపూర్ణగీతయేగదా ! ఇట్లుండ 1939 వ సంవత్సరమున వారణాసీపురమునుండి అరుదెంచిన వ్రాత గ్రంథముల కట్టలలో నొక గీతా లిఖిత గ్రంథము అతడి దృష్టి నాకర్షించెను. అది 40 పుటలగలిగి భోజపత్రములపై వ్రాయబడియున్నది. అద్దాని చూచుటతో నాటికి 30 వత్సరముల దపస్సు ఫలించెగదా యని శ్రీచరణతీర్థుని ఆనందమునకు మేరలేదయ్యెను. దాని సాకల్యముగ బరిశీలించి, 1941 వ సంవత్సరమున అక్టోబరు మాసమున బ్రథమతః సంస్కృత ఉపోద్ఘాతముతో నతడు ప్రకటించియుండెను. 1953 వ సంవత్సరమునకు నాగ్రంథము ఆంగ్ల భాషా పీఠికతోడను, పాఠాంతర వివరణములతోడను, అయిదవ ముద్రణమును బొందియున్నది.

ఈప్రాచీన గీతలో మహాభారత శ్లోకప్రకారము 745 శ్లోకములు పూర్తిగనుండుటయు, నవియు, నా శ్లోకములు సందర్భోచిత స్థానముల నుండుటయు, విశేషము. ఇందు ప్రస్తుత గీతకు విభిన్న పాఠాంతరములు సుమారు 300 వరకునుండి తాత్పర్యభేదము లేకయున్నవి. శ్రీకృష్ణునికి 621, అర్జునునకు 65, సంజయునకు 68, ధృతరాష్ట్రునకు 1 శ్లోకమును గలవు. ఈగీతలోగల అధిక శ్లోకములలో

పదింటిలో, శ్రీకృష్ణునకు 1, అర్జునునకు 8, సంజయునకు 1 యున్నవి. ఇవి మూడుపాదముల శ్లోకములు. ఇట్టి మూడు పాదములుగల శ్లోకములు మహాభారతమునను, పురాణముల లోను గలవని శ్రీచరణతీర్థుల వివరణము. పది శ్లోకములు విచ్ఛిన్న శ్లోకముల బూరించుటచే నేర్పడియుండుననియు నతని తాత్పర్యము. శ్రీకృష్ణార్జునుల సంవాదమును సంజయుడు ధృతరాష్ట్రునకు దెలుపుచున్నాడుగాన అర్జునున కన్వయించు ననేక శ్లోకములు యథార్థమున సంజయుడు వచించియున్నవి. శ్రీకృష్ణ సంజయులకు ఒక్కొక్క శ్లోకము మహాభారత శ్లోకమునకు మించియుండుటయందు విశేష మేమియును లేదు. మూడుపాదముల, నేకపాద శ్లోక గణనమున నా విభేద ముత్పన్నము అట్టి గణనము ననుసరించియే అర్జునునకు 57 శ్లోకములకు 65 చూపబడినవి అందుచే సంజయ అర్జునుల శ్లోకసంఖ్యలో దారతమ్య మగోచరమనియే తీర్మానము. శ్రీకృష్ణునకు బూర్తిగ 45 శ్లోకములు అధికమని స్పష్టము. ఈశ్లోకములు ప్రస్తుత గీతా అసంపూర్ణత్వమును బూరించినవి. అందుచే నీ భోజపత్ర గీతా ప్రతి మహాభారత వాక్యానుసారము గలదనియు, నదియే యథార్థమైన గీత యనియు దన గాఢ విశ్వాసముగ శ్రీచరణతీర్థులు వచించియున్నాడు.

ఈప్రాచీన గీతాప్రతిలో బ్రస్తుత గీతా శ్లోకములు స్వల్ప పాఠాంతరములతో నుండుటయు, నందును నా పాఠాంతరములు అధికములు కాశ్మీర ప్రతుల ననుసరించియుండుటయు గమనార్హము. ఈరెండు ప్రతుల గానరాని అధిక శ్లోకముల గూడ జూపి, యథార్థ గీతాస్వరూపమును మనకు యిందు

గానబరచుట ముఖ్య విశేషము. అధిక శ్లోకములు, అధిక పాదములు నక్షత్ర చిహ్నముతో నీ ప్రాచీన గీతయందు ప్రత్యేకముగ సూచింపబడినవి. అట్టి సమగ్ర గీతాశాస్త్రము యింతకాలమునకు లభించుట అదృష్టము.

ఈ ప్రాచీన గీతాప్రతిలో నధ్యాయముల నామధేయములు ప్రస్తుత గీతాప్రతి నున్నచందము గానము. కేవలము 'ప్రథమోధ్యాయః, 'ద్వితీయోధ్యాయః, అనిమాత్రమే యున్నవి. మరియు ప్రస్తుత గీతాగ్రంథమున ప్రతి అధ్యాయాంతమున 'శ్రీ మద్భగద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాదయోగో నామ ప్రథమోధ్యాయః' అనురీతి ఇవి యుపనిషత్తు అనియు, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రముగను స్పష్టపరుపబడుచుండును. ఇట్టి అధ్యాయాంతపాఠముగూడ ప్రాచీన గీతాప్రతిలో నభావము. అందుచే ప్రథమతః గీతాగ్రంథమున నధ్యాయ నామధేయములు, ఈ అధ్యాయాంత వచనములును లేక సామాన్యముగనుండి, కాలాంతరమున నీగ్రంథము బ్రహ్మ విద్యా శాస్త్రముగ ప్రఖ్యాతినొంది, జిజ్ఞాసువుల శాస్త్రజ్ఞుల దృష్టి నాకర్షింప, దాని ప్రాధాన్యత కనుగుణరీతి నివి కూర్ప బడి యుండునని తోచెడిని. 15 వ శతాబ్దమునకు జెందినదని వాకొనబడుచున్న శుద్ధ ధర్మ మండలివారి గీతాప్రతిలోగూడ ప్రత్యేకముగ నధ్యాయ నామములు గోచరము. అధ్యాయాంతముల నందు 'ఇతి శ్రీ మద్భగవద్గీతాయాం యోగబ్రహ్మ విద్యాయాం... అని వచింపబడియున్నది. అందుచే పై అనుమానము సత్యమనిపించుచున్నది.

ఈవిధముగ సమగ్ర గీతాశాస్త్రమును గీతావిద్యార్థిలోకము

నకు ముందుంచిన శ్రీచరణతీర్థులు ధన్యులు. ఈసందర్భమున నతని వాక్యములు గమనార్హము. 'ఆత్మస్తుతిదోషముగలుగుచున్నను, గీతాశాస్త్రమును, గీతాపాఠకులకు— యిట్టి సేవాభాగ్యము జేసికొను అదృష్టము ప్రథమతః ఓటో ష్రాడర్ పండితునకు, ద్వితీయతః గోండాల్ రసశాలకును చెందియున్నది. అనేక విద్వాంసులు గీతా సమస్యల ననేకము సూచించియున్నారు. 745 శ్లోకముల గీతా ప్రచురణమున నింక ననేకనూత్న సమస్య లుత్పన్నములు. వాని బరిశీలించి, వివరించి, నివారింపజేయుట యీ క్లుప్తమైన ఉపోద్ఘాతములో నసాధ్యము. అందులకు గొంత కృషి గావింపబడియున్నది. అయినను అనేక సమస్యలు సమస్యలుగనే యుండిపోయినవి. వాని విషయము భవిష్యత్కాలమునకు నిలిపివేయబడినది' అని ఆపండితుని వాక్యములు. యథార్థమున నంతియే. విశాలబుద్ధి సద్విమర్శాదృష్టివిచారించుచో కఠినములని భావింపబడు అనేక సమస్యలుగూడ నదృశ్యములగును. విమర్శకులకు అట్టి దృష్టి ప్రథమత ప్రధానముగ నవసరము. పాక్షిక భావములు, మతాభిమానములు, పట్టుదలలు, చారిత్రక గవేషణాశీలునకు దూరములు. అవి యథార్థమును మరుగుపరచి కృత్రిమరూపముల సత్యభావన గలుగజేయును. అందుచే నీ ప్రాచీన గీతాప్రతిని గీతాభిమానులు పరిశీలించి, సత్యమారసి సంపూర్ణ గీతాశాస్త్ర వ్యాప్తికై బూనుకొందురుగాక అని మా ఆశయము.

ఆంధ్రదేశమున నీ ప్రాచీన గీతావ్యాప్తికొరకు యీప్రచురణమునకై మాగ్రంథమాలకు అవకాశమొసంగిన శ్రీ రస

శాల ఔషధాశ్రమము వారికి మా యానందమును, ఆంధ్రుల తరపున ధన్యవాదములను అందజేయుచున్నాము.

ప్రస్తుత ప్రచురణము ఆంధ్రలోకమునకు కేవల పరిచయమునకై గావింపబడినది. ఈ గీతాప్రతి దేశమున నాదరణము నొంది, ముమ్ముందు టీకా తాత్పర్య వివరణములతో సర్వాంగ సుందరముగ ప్రత్యక్షమగునుగాక అని ఆశించుచున్నాము.

హరిః ఓం తత్ సత్

# పారాయణక్రమము

## విఘ్నేశ్వర ప్రార్థనము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

## విష్వక్సేన ప్రార్థనము

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

## సరస్వతీ ప్రార్థనము

యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుతశంకర ప్రభృతిభిర్దేవై స్సదాపూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

## గురు ప్రార్థనము

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరంబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥

గుకారో హ్యంధకారస్స్యాత్ రుకార స్తన్నిరోధకః ।
అంధకార నిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే॥

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥

అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

## వ్యాసమహర్షి స్తోత్రము

వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥

అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।
అఫాలలోచనశ్శంభుః భగవాన్బాదరాయణః ॥

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయత పత్రనేత్ర ।
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయప్రదీపః ॥

## శ్రీకృష్ణ స్తుతి

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే ।
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమో నమః ॥

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్ ।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే ।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంత వేదినే ॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥
సారథ్యమర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥
మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్ కృపా తమహం వందే పరమానంద మాధవమ్ ॥

గీతా నుతి

సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥
భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్ ।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్ ॥
సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః ।
సర్వతీర్థమయీ గంగా సర్వధర్మమయో మనుః ॥
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం
ఏకో దేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకో మంత్రో దేవకీపుత్రనామ
కర్మాప్యేకం దేవకీపుత్ర సేవా ॥

ధ్యానము

కరకమల నిదర్శితాత్మముద్రః
పరికలితోన్నత బర్హి బర్హ చూడః ।
ఇతరకర గృహీత వేత్ర తోత్రః
మమ హృది సన్నిధి మాతనోతు కృష్ణః ॥
ఆతామ్రపాణి కమల ప్రణయ ప్రతోదం
ఆలోలహార మణికుండల హేమసూత్రమ్ ।
ఆవిశ్వమాంబుకణ మంబుదనీల మవ్యాత్
ఆద్యం ధనంజయ రథాభరణం మహోనః ॥
అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం
ఆబిభ్రాణో రథ మధివసన్ పాతున స్సూతవేషః ॥
పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినామధ్యే మహాభారతమ్ ।
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥

---

